ఓం   శ్రీ గురుభ్యోనమః   ౦౧౦

# అనంతోపనిషత్

మిత్రుల కోర్కెపై భజనలో, నగర సంకీర్తనలో పాడుకొనుటకై

స్వేచ్ఛా గేయానువాదం



## భూమానంద నల్ల ఉపేంద్రయ్య

ఓం శ్రీ గురుభ్యోనమః ఓం

# అనంతోపనిషత్

మిత్రుల కోర్కెపై భజనలో, నగర సంకీర్తనలో పాడుకొనుటకై

స్వేచ్ఛా గేయానువాదం



భూమానంద నల్ల ఉపేంద్రయ్య

అనంతోపనిషత్

ప్రథమ ముద్రణ- 2000 1999

ద్వితీయ ముద్రణ- 2000 మే 2006



ముద్రణ : శ్రీ ధనలక్ష్మి ప్రింటింగ్ ప్రెస్, రాధికా టాకీస్, వరంగల్.

ఫోన్: 0870-2426082 సెల్: 9290099345

ధర రూ. **3-00**

ప్రతులకు: ఉత్తర ప్రత్యుత్తరాలకు :

-నల్ల ఉపేంద్రయ్య
ఇం.నెం. 16-10-706, శివనగర్,
వరంగల్. 506 002

# సందర్భం

అనంతపురం జిల్లా, నంబులపూలకుంట మండలం, గిన్నీస్ బుక్ రికార్డుకెక్కిన శ్రీ తిమ్మమ్మ మర్రిమాను వద్ద 9-5-2006 నుండి 10-5-2006 వరకు శ్రీ **మదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య మహాసభలు,** శ్రీమన్నారాయణ శ్రీధర శివరామ దీక్షితాచల గురుపరం పర శ్రీ కేవలానంద గురుపూజా మహోత్సవాలు జరుగు సందర్భములో

అచల బోధ సంప్రదాయంలో మంచి వక్త, యువ సామ్రాట్ **శ్రీమత్ పూర్ణానంద గౌదుచెర్వు బ్రహ్మానంద రెడ్డి, కదిరి** గారి సంస్థాగత, వ్యక్తిగత సమాహ్వానాన్ని పురస్కరించుకొని ఈ సంక్షిప్త అనంతోపనిషత్తును **శ్రీమద్గురు మాతా భక్తానంద తూడి దేవమాంబగారి** కృప వల్ల రెండవ ముద్రణ గావించి సమర్పిస్తున్నాను.

-భూమానంద నల్ల ఉపేంద్రయ్య
ఇం.నెం. 16-10-706, శివనగర్,
వరంగల్ జిల్లా. పిన్: 506 002 A.P

**రచయిత, రంగస్థల కళాకారుడు, ఉపాధ్యాయులు, అచలగురు పీఠాధిపతి**
**శ్రీ నల్ల ఉపేంద్రయ్య గారి రచనలు 1960 నుండి 2006 వరకు**

1) అచల పరిపూర్ణ గురుపీఠ గ్రంథాలు: అనుష్ఠాన క్రమము, నిర్మలానంద తత్వదర్శిని, రాజమండ్రి శ్రీరాపేణ ఆదినారాయణగురు చరిత్ర, అచల వేదాంతాచార్యులు, శ్రీ భాగవతుల కృష్ణయ్యగురు కవితా వైభవం, భద్రాద్రి రామశతకము (సంస్కరణ), శ్రీమించు అచలబోధ, అనంతోపనిషత్, మాయా విలాపం, గురుపూజ, అచల స్థితి సాధనోపన్యాస మంజరి, అచల బోధ ప్రవక్త శ్రీ శివ రామ దీక్షితులు.

2.) శతకాలు: తెలంగాణ శతాకాలు 1,2,3. భాగాలు, కవిరత్న భూమయ్య శతకము, కాళన్న శతకము, యేసు ప్రభు శతకము, అవినీతి హెడ్‌మాస్టర్ శతకము, ఎయిడ్స్ శతకము, దుర్మార్గ పీడిత వరకట్నశతకము శ్రీ ఉపాధ్యాయ శతకం.

3). ప్రవహించే పాటల పుస్తకాలు: అక్షర సమరం,వెనుకబడిన కులాల రాజకీయ చైతన్య గీతాలు (పద్మశాలి, పెరుక, గౌడ, సగర, ముదిరాజ్, రజక, నాయీబ్రాహ్మణ, వడ్డెర కులాలపై, ఒక్కొక్క కులంపై ఒక్కొక్క ఆడియో క్యాసెట్టుకు సరిపోయే చైతన్య గీతాలు, ఎయిడ్స్ నివారణ గేయాలు)

4) క్షేత్ర సంబంధ రచనలు: మేడారం సమ్మక్క సారలమ్మ జాతర విశేషాలు (లక్షల కాపీలు ముద్రణ) రామప్ప శిల్పి కన్నీటి గాథ, శ్రీ గట్టు మల్లన్న క్షేత్ర మాహాత్మ్యము శబరిగిరి స్వామి చరిత్ర.

5) ఆధునిక సాహిత్య ప్రక్రియలు: దుందుభి, ప్రగతి సూత్రాలు ప్రజా గీతాలు, జలప్రళయం, సారాకథలు, అనుభవాలు జ్ఞాపకాలు,

6) వ్యాఖ్యాన గ్రంథాలు: ప్రబంధ గణపతి, కావ్యకాంతామణులు, ఆచలయోగి వేమన, మన ప్రధాని పి.వి. రసమయ పద్య సంకలనం, భాగవతుల కృష్ణయ్యగురు కందార్థ దర్పులకు సులభ వ్యాఖ్యానం, గురుగీతకు సులభ వ్యాఖ్యానం అచలబోధ ప్రాదుర్భావ వికాసం. శ్రీ శివరామ దీక్షితుల అచలబోధ సంగ్రహము. అచలబోధలో స్వప్న గాథాలహరి. ఆచలం కథలు

7) పరిష్కరణలు: మేరుగు నారాయణ గురు రెండు గ్రంథాలు, కోడం శంకరార్యుల వారి రెండు గ్రంథాలు కొత్తకొండ పుల్లయ్య కవి రచనలు, నిత్య నిర్మల యాత్ర యోగీశ్వరుల వారి గ్రంథాలు. తత్వదర్శిని మొదలగు

8) ఇతరములు: కావ్యసమీక్షలు, అభినందనలు. సన్మాన సత్కార పత్రాలు. పీఠికలు. అక్కడక్కడ అనేక సందర్భాలకు వ్రాసిన రచనలు ఎన్నో...

# అనంతోపనిషత్ ప్రారంభం

1) ఆతశ్శివ ఏవ సనాతన
బ్రహ్మ భగవాన్ అచలమేవ సత్యం
తె॥ శ్రీ మించు శివరామ దీక్షితుల బోధ
అచలాన్నె బ్రహ్మ మని అన్న దిది చూడు
2) బాహ్య ముపైతి విద్వాన్
అన్య జ్ఞానం నాస్తి
తె॥ శివరామ పండిత సిద్ధాంత మందు
బట్ట బయ లొక్కటే, లే నెరుక లేదు.
3) జన్మ ప్రవృద్ధి నాస్తి
నాస్తి జ్ఞప్తి స్సర్వ సదా సత్య వాక్యం
తె॥ చావు పుట్టుక లన్న జడుపెపుడు లేదు
వాని మూలంబైన ఎరు కెపుడు లేదు
4) బ్రహ్మాండం వ్యాపితం బాహ్యం
బాహ్యం సర్వత్ర వ్యాపితం
తె॥ బ్రహ్మాండ మంతటా బయలు నిండుండె
బయలులో లే నెరుక బ్రహ్మాండ మయ్యే

5) అంత ర్బహిశ్చ తద్బాహ్యం
అన్యం నా స్తీతి నిశ్చయం
తె॥ లోన వెలుపల కూడ బయ లొకటె చూడు
లేనె లేదూ లేని ఎరుక దా నందూ
6) ఇతి నిశ్చిత్యయో విద్వాన్
అచల మేవ న సంశయః
తె॥ ఇట్లు నిశ్చయ మైన విద్వాంసు లంతా
అచల సిద్ధాంతు లై అలరు చున్నారు.
7) ఆనంద రూప గుం నాస్తి
అచలం చాస్తి సర్వదా
తె॥ ఆనంద బ్రహ్మ మని అంటారు కానీ
అచల పరిపూర్ణ మాపై నుండి చూడూ
8) స ర్వానంద విహీనశ్చ
అచ లోయం సనాతనం
తె॥ సార హీ నానంద సందడే లేదు
సనాతనం బైన అచల మార్గాన

9) సత్యాసత్య విహీనశ్చ
వి ద్యావిద్య వివర్జితం
తె॥ స త్యాసత్య ద్వయము చర్చించ లేదు
వి ద్యావిద్యల ద్వయము వివరించ లేదు
10) ద్వై తాద్వైత విహీనశ్చ
ధ ర్మాధర్మ వివర్జితం
తె॥ ద్వై తాది మత బోధ ధర్మాలు కాందీ
పాషాండ గుణ కర్మ పద్ధతులు లేందీ
11) బం ధాబంధాది రహితం
అమృతం చాస్తి సర్వదా
తె॥ బంధ మోక్షము లేని పరమైన బయలు
ఆచలమై నిత్యమై అంతటను ఉందీ
12) సర్వం పరిపూర్ణ గుం సత్యం
శివా దన్యం నకించన
తె॥ ఉన్న పరిపూర్ణమే ఉన్న దెన్నటికీ
లే నెరుక జో లందు లేనె లే దెపుడు

13) భ్రాంతి జ్ఞానం పరిత్యజ్య
సర్వం నాస్తీతి నిశ్చయం
తె॥ భ్రాంతియే యీ ఎరుక పట్టు విడువాలే
ఎరుక జగములు లేక ఎప్పు డుండాలే

14) ద్రష్టా దృక్ జగ త్సర్వం
సంభవం నాస్తి సర్వదా
తె॥ జగము, చూచెడి వాడు, చూచేది, ఎరుకే
పుట్టనే లేనపుడు గిట్టు నను టేల

15) బ్రహ్మ స్పృహ భ్రమో నాస్తి
వంధ్యా సూను రి వాపిచ
తె॥ బ్రహ్మ నే నను భ్రాంతి బయలందు లేదు
ఉందంటె, గొడ్రాలు బిడ్డోలె చూడు

16) క్షీర పాసేన సర్పస్య
విషం నశ్యేత్ జగత్ భవేత్
తె॥ పాలు త్రాగిన పాము విష ముడిగి యుంటే
ఎరుక పుట్టిన మాట సత్యమై యొప్పు

17) పవనో స్త్రేణ భిద్యే చ
జగత్ సత్యం భవిష్యతి

తె॥ కత్తి వేటుకు గాలి తెగి తునక లైతే
ఎరుక పుట్టిన మాట సత్య మన వచ్చు

18) దృష్ట ప్రపంచ మి త్యుక్తం
మూఢ ఏవ న సంశయం

తె॥ భ్రమ వల్ల కనిపించు బ్రహ్మాండ మంతా
నిజ మంచు నమ్మేరు నీచ మానవులు

19) శుక్తౌ రజిత వద్భాతి
యథా రజ్జౌ హి సర్పవత్

తె॥ సుద్ద ముక్కలు, వెండి వలె తోచు చుండు
త్రాడు పామై కరచి చంపి నట్లుండు

20) తథా భాసతి సర్వత్ర
సర్వం శశ విషాణవత్

తె॥ ఆటువంటి యీ ఎరుక అచలాన లేదు
కుందేటి కొమ్ము ఏ కోశాన లేదు

21) దృశ్యం దృక్ తథా ద్రష్టా
త్యక్త్వా తద్వాసనా సహ
తె॥ దృశాన్ని, దృక్కును, ద్రష్టనూ యెపుడు
లే నెరుక యని విడిచి లేక యుండాలే

22) త దేవ నాస్తి చా ప్యాత్మా
దేహ ప్రాణాది సౌజ్ఞికం
తె॥ పరిపూర్ణ మొక్కటి తప్ప యీ సర్వం
ఎరుక యని ఎరుగాలె ఎల్ల కాలంబు

23) జ్ఞాన మానంద గుం బ్రహ్మ
ఇ త్యుక్తం మూఢ మానవైః
తె॥ ఎరుక ఆనందమే బ్రహ్మం బటంచు
సకల మతముల వారు సంతసించేరు

24) భ్రాంతి మూల మిదం జ్ఞానం
జ్ఞానం భ్రాంతిస్తు నిశ్చితం
తె॥ భ్రాంతు లన్నింటికీ మూల మీ ఎరుక
ఎరుక భ్రాంతుల వల్ల ఏర్పడిన దన్న

25) జ్ఞాన మానంద గుం నాస్తి
ఇతి వేదాంత నిశ్చితం
తె॥ జ్ఞాన మానందాలు లేనె లే వంచూ
అచల గ్రంథము నిర్ణయించింది చూడూ
26) సముద్రే భంగ ఫేనాని
బుద్బుదాని చ సర్వతః
తె॥ సాగరంబున లేచు కెరటాల వలెనే
నీటి బుడగల వంటి నిఖిల దేహాలు
27) యథా జాతం తథా నశ్యం
యావత్ సర్వం చరాచరం
తె॥ ఎట్లు జన్మించిందొ అట్లనే చచ్చు
పరిపూర్ణ బ్రహ్మాన ఎరుకె పుడు లేదు
28) సముద్రే మత్స్య కూర్మాదాః
యథా చరతి జంతవః
తె॥ జల చరంబుల నెల్ల జలధు లె ట్లెరుగు
బట్టబయలున నొక్క ప్రాణైన లేదు

29) అంత ర్బహిశ్చ తద్ వ్యాప్తం
శివం సర్వ గతం శృణు
తె॥ అందు, యిం దన రాక, ఎందు జూచిననూ
పరిపూర్ణ మొక్కటే ప్రకటమై యుందు
30) సర్వం బాహ్య గతం నిత్యం
జ్ఞానం నా స్తీతి నిశ్చితం
తె॥ సూది కొన మోపుటకు చోటింత లెందీ
బట్టబయలే ఎరుక దా నందు లేదు
31) త దేవ జాత మి త్యుక్తం
తదేవ నశ్యతి శృణు
తె॥ అదె వచ్చు, అదె చచ్చు, అదె ఆట లాడు
దాన్ని పుట్టించిన దా తొకడు లేడు
32) బ్రహ్మ విష్ణ్వాది దేవేశ్చ
వందితం పరమ శ్శివం
తె॥ బట్టబయలకు బ్రహ్మ, హరి, హ రాదులును,
ప్రణతు లర్పించారు పరిపూర్ణ మనుచు

33) జాగ్రత స్వప్న సుషుప్త్యాది
అవస్థా పంచకం న హి

తె॥ జాగ్ర దాదులు లేవు, జగ యుగము లేదు
పంచావస్థలు లేవు. బట్ట బయలందు

34) సర్వ కాలే సదా వ్యాప్తం
సర్వ దేశేషు వ్యాపితం

తె॥ సర్వ కాలము లందు, సర్వదేశాల్లో
ఆద్యంత రహిత మై, ఆచలమే యుండు

35) నిష్కామం నిర్మలం శుద్ధం
"ఆచలం" శబ్ద వర్జితం

తె॥ నిర్గుణం, నిర్మలం, నిష్కామయోగం
శబ్దాని కవలుండు, నిశ్శబ్ద బ్రహ్మ

36) తేజోంధ కార రాహిత్యం
"బాహ్య బ్రహ్మ " న సంశయం

తె॥ రాత్రి పవలులు రెండు, రహితమై యుండు
పరిపూర్ణ బ్రహ్మంబు- పరికించి చూడు

37) న స్నానం న చ ధర్మశ్చ
న చ కర్మ న వర్తనం
తె॥ స్నానాలు, జప, తప, శాస్త్రాలు కావు
సాలోచ నాత్ముడై సాధించ వచ్చు
38) జాతం నాస్తి మృతం నాస్తి
నాస్తి జ్ఞానం కదాచన
తె॥ పుట్టు, గిట్టుట లున్న, వట్టి యీ ఎరుక
పుట్టు, గిట్టుట కవలి, పూర్ణాన లేదు
39) ప్రపంచం నాస్తి సర్వత్ర
నాస్తి త త్కారణం సదా
తె॥ కనిపించె యీ ఎరుక, కల వంటి దయ్యె
మూల మింతయు లేని, మాయ జగ మయ్యె
40) పునః పునః ప్రవక్ష్యామి
సాక్షి ర్నా స్తీతి నిశ్చయం
తె॥ మరి మరీ చెబుతాను, మనిషి కల కాదు
సురస్వప్న మై యుండె చూడు ఏ ఎరుక

41) బహుదా తర్క వాదేన
కిం ఫలం కిం గమిష్యతి
తె॥ సార హీనం బైన చర్చ లింకేల
మౌన వ్యాఖ్యానాన మనసు దృఢ మౌను
42) అజ్ఞాన నరకం సిద్ధం
అన్య మార్గాను వర్తనం
తె॥ అజ్ఞాన సిద్ధాంత, మార్గాట మెల్ల
నగు బాటు కల్పించు నరకాన కూల్చు
43) బ్రహ్మ, విశ్వం ద్వయం మిథ్యా
ఇతి నిశ్చయమే న హి
తె॥ విశ్వాన్ని పుట్టించు బ్రహ్మ, యీ విశ్వం
రెండు లేనే లేవు, దండి పూర్ణాన
44) ఏ తత్ వాక్య నిబోధోయం
గురు వాక్యేన లభ్యతే
తె॥ ద్వాదశీ–షోడశీ ద్వయ మంత్ర సారం
గురు మూర్తి దయ వల్ల గుర్తించ వచ్చు

45) శిష్యో ర్నాస్తి గురు ర్నాస్తి
నాస్తి జ్ఞప్తి కదాచన
తె॥ అన్ని తెలిసిన వెనుక, ఆచలమే యుందు
గురువు శిష్యులు లేరు, గుర్తేమి లేదు.
46) ఏ తత్ శ్రవణ మాత్రేణ
విద్యా విద్యే చ నశ్యతి
తె॥ పరిపూర్ణ బోధను పరికించి చూస్తే
ద్వయ దోష సహితంబు ధ్వంసమై పోవు
47) యో మానవాః పరిశ్యంతి
బాహ్య రూపా భవంతి వా
తె॥ ఏ జనులు, యీ బోధ, నెర్గి యుంటారో
భ్రమ రహిత మై, బట్ట బయలు గంటారు
48) తేషాం న విద్యతే జన్మ
ఇతి వే దాంత జర్ఝరః
తె॥ జనుల కీ బోధతో జన్మ రహితంబు
అవునంచు శివరాము డన్నాడు ధరలో
సంపూర్ణం